# ఆర్యరక్షామణి



గిన్నవరపు సూర్యనారాయణమూర్తిచే

రచియింపఁబడినది.



మొదటికూర్పు.

**Vegu-Jukka Printing Works,**

**Berhampore, (Ganjam).**

**1920.**



వెల రు. 0—4—0లు.

శ్రీరామచంద్ర.

# ఆర్తరక్షామణి:



ఇయ్యది

గన్నవరపు సూర్యనారాయణ మూర్తిచే

రచియింపఁబడినది.



మొదటికూర్పు

Vegu-Jukka Printing Works,

Berhampore, (Ganjam).

1920.

 వెల రు. 0—4—0లు,

# మోహినీవసంతము.

ఈ నాటకము 'షేక్సిపియర్' మహాకవి రచించిన సింబలెన్ అను కథననుసరించి ప్రతిపద్యమును ముద్దులుమూటగట్టు చుండు శైలితో, మనోహరములగు భావములతో వ్రాయఁబడి యాంధ్రభాషా యోషామణికి నూతనాలంకారమువలెఁ బ్రకాశించుచు గ్రంథమును కొనవరకు జదివినగాని విడువ బుద్ధి పుట్టనీయదు. అప్పుడే రెండవ కూర్పునకు సిద్ధముగ నున్నది. వెల రు. 0—12—0లు మాత్రమే.

గ్రంథకర్త:—గన్నవరపు సూర్యనారాయణమూర్తి,
బరంపురం, (గంజాంజిల్లా.)

# ప్రచండ విజయము.

లేక,

## సైంధవాస్తమానము.

ఇదియొక వీరరస ప్రధానమైన నాటకము. ఇందలికథ భారతమునుండి గ్రహించి మ॥ రా॥ రా॥ గన్నవరపు సూర్యనారాయణ మూర్తిగారిచే రచింపఁ బడినది. ప్రతి పద్యమును ముద్దులుమూటగట్టు నవీనములగు భావములతో విలసిల్లుచు నిట్టినాటకము మనయాంధ్రభాషలో మరియొకటికలదా యను సంశయము చదివిన ప్రతివారికిని గలుగక మానదు. కొలది ప్రతులు మాత్రమే యున్నవి. వెల రు. 0—8—0లు

వలయువారు:—

కోట్ని కృష్ణమూర్తి, బరంపురం, గంజాంజిల్లా.

అని వ్రాసిన బడయగలరు.

# పీఠిక

———o———

నేను 1916 వ సం॥రమున 'ప్రచండవిజయము' అను పేర వజ్రనుఁడు వైభవుని జంపుటయు, 1918వ సం॥రం॥ మున 'షేక్స్పియర్' మహాకవి రచించిన 'సింబలైన్' (Simbaline) అను కథను "మోహినీవసంతము" అను పేరను నాటకరూపము లుగా రచించి ప్రచురించిన పిదప నేటివరకు మరొక్క గ్రంథము ను బ్రకటించుటకు యుద్ధకారణమున శక్తిఁ జాలని వాఁడ నయ్యు సంసార సముద్రమునుండి తరించి జన్మసాఫల్య మొందుటకుగాను నీకృతి భగవత్కైంకర్యముగా నొకదినమున వ్రాసియుంచుటచే విద్వాన్నిమాత్రము బ్రచురింప సాహసింపఁ గలిగితిని. 'ప్రమాదో ధీమతామపి' అను న్యాయానుసారము ఈ కృతియందెచ్చటనయినఁ బొరపాటులున్న గుణగ్రహణ పారీణులగు పండిత మహాశయు లవ్వాటిని దెలియఁజేసినచో వారికెంతయు విధేయుఁడనై రెండవకూర్పునందు చేతులుజోడించుకొని వాటిని సవరించు కొనువాఁడను.

బరంపురం
25—1—1920

ఇట్లు బుధజన విధేయుఁడు,
గన్నవరపు సూర్యనారాయణమూర్తి.

# పండితాభిప్రాయము.

ఈకృతివిషయమై మ॥ రా॥ రా॥ కవికుక్కవరకాళిదాస సమస్తాగమ సర్వతంత్ర స్వతంత్రాద్యనేక బిరుదాంకితులును, సువర్ణలతా పరిణయము లోనగు నానావిధ గ్రంథకర్తలు నగు పూడిపెద్ది లింగమూర్తి పంతులుగారిచే నవాభిప్రాయ పూర్వకముగా నొసంగఁబడినది.

శా. బర్హంపూరున గన్నపర్వనెడి సద్వంశ్యుండవై వింశతి
ప్రాప్తప్రాయమునం దనర్గళకవిత్వానూన వాగ్ధాటిచే
నిర్ణేతాత్మకలన్ శతాబ్దము "లవంతీవార్ధిదంత్యంబుద"
సార్థత్వంబులఁ జేసితివు కృతినంచత్ సూర్యనారాయణా.

31—1—1920 ఇట్లు,

బరంపురం. పూడిపెద్ది లింగమూర్తి



శ్రీరామచంద్ర.

# ఆర్తరక్షామణి.



శ్లో॥ స్సాకేతే మణికోటిదీప్తి భవనే కందర్ప సామ్యాకృతిమ్
రూపే షోడశచంద్రకాంతి వదనమ్ శ్రీజానకీసేవితమ్
కారుణ్యాన్విత వీక్షణమ్ మునిహితమ్ కాకుత్స్థ వంశోద్భవమ్
శాంతమ్ సజ్జనసాధుసంఘవినుతమ్ శ్రీరామచంద్రమ్ భజే.

శా. హేసీతాధిప! హేజగత్త్రయగురో! హేభక్తమందార! కై
లాసాధీశ మహేశ్వరాది నుత! తల్లంకేశ జీవాపహా!
దాసోహమ్మని వేఁడుచుంటి నిదె విద్యాశూన్యుఁడన్ గాన నే
నీ సత్వంబు గణింపలేకకట! తండ్రీ! ఆర్తరక్షామణీ!.

మ. ఖలుఁడౌ పుత్త్రుఁ డవెన్ని కానిపనులం గావించినం బాల్ర వ
త్సలతన్ వానిని వానితండ్రి దయచేతం జూచుచందంబు నే
ఖలుఁడన్, మూర్ఖుఁడ, దుష్టబుద్ధినయినం గాపాడి రక్షింప నీ
వ్వలనం దండ్రివి నేనుపుత్త్రుఁడను దేవా! ఆర్తరక్షామణీ!.

శా. దేవా! దేవర పాదపద్మముల భక్తిఁ గోల్పడి మూఢుండనై
యేవేళం గడు ఘోరపాపముల నెన్నేని గావించి ఓ
జీవాధార! భయంబుఁగొంటిఁ బవ రాజీవంబులం గొల్వఁగా
నీవే దిక్కని చేరవచ్చితిని తండ్రీ! ఆర్తరక్షామణీ!.

శా. ఎన్నేనరమ్యో దివంబులే జనన్నమ్ము యీ భూమిపై దేవ! నే
మున్నెన్నడున్ మందబుద్ధిని "ప్రభో! లోకేశ! చిద్రూపసం
పన్నా! బ్రోవవె" యంచు భక్తిఁబలుక న్నాపాత్ముఁడఁ గాఁ దండ్రీ! న
న్నెన్నన్నాఁతను శ్రీమఁజావు నతుఁడన్ గానార్త రక్షామణీ!

శా. ఏవో చేసితిఁ జేయరానిపనుల న్నెన్నింటినో మైన నా
భావంబెప్డు పదారవిందములు త్వత్పాదాబ్జముల్ దిక్కుగా
లేవైరాగ్యుని భంగినిల్చి నడివీధిన్ నన్ను నిల్పెట్టి మే
తావాలాయముగాను దీనుఁడను గానా? ఆర్తరక్షామణీ!

శా. అన్నా! యేమనవచింపనెంతును మహాత్మా! పూర్వజన్మంబు
నం! దెన్నింటిన్నడు దుష్కృతంబులకటా! యేఁ జేసినానో యటు
ల్కాన్నీ రోడికవిరార వానిఁ గుడువంగా వచ్చెఁ దండ్రీ! యిఁకన్
నన్నాదింపవె దీనపాలుఁడ వనంతా! ఆర్తరక్షామణీ!

శా. తెలుంగీమునుజాది బ్రోచుటదినుమ్మా ధర్మమా దేవ! ఏ
వేళన్ దానిని పీడరవ్వారన నీపేదానిఁ బోషించినన్
జాలన్నర్తున? తెల్విహీనతను మున్ గావించు పాపాళికిన్
జాలన్ దోసిలి యొగ్గినాఁడఁగద ఈశా! ఆర్తరక్షామణీ!

శా. పాపాత్ముండను, దుర్మదాంధుడను దివ్యజ్ఞానహీనుండ, పేన్
గోపిన్, దూర్తుఁడ నంచు నెంచి యముఁడున్ గోపించి యేరీతి నో
భూపా! బాధలఁ దోయునోయనుచు నన్ బ్రోవంగ నీకేటి నే
నీపాదంబులఁ బట్టినాఁడఁగద, తండ్రీ! ఆ॰ రక్షామణీ!

మ. సకలైశ్వర్య సమృద్ధిచే, సుజన రక్షాదక్ష సద్భక్తియా
ధికమై వర్ధిల్లెదు శక్తిచే, భువనముల్ దేదీప్యమానంబులై
వికటంబౌ గతిఁ జేయ నేర్చునను దేవా! నిల్చునీవుండ నిం
కొకరిన్ వేఁడఁగఁ జేయు సాకున? కృపాఢ్యా! ఆర్త రక్షామణీ!.

మ. తనుబాల్యంబునె తండ్రి వీడిచనఁగా నాతండ్రి! నాతండ్రిక
న్ననుఁ బ్రేమంబునఁ బెంచె నీవనుచు నెన్నంరాని మోహంబుచే
తను నేనుండఁగ నాదునాశ నకటా! నాశ్మారుగాఁ జేతువే?
యనఘా! యేనిక నేమిసేతు నిది మేలా? ఆర్త రక్షామణీ!.

మ. పుడమిం బుట్టినదాది నేటివరకున్ భూమీశ! మోహంబుతోఁ
గడిమైనన్ జరియింపరాని నెపుడున్ గనంగోన లందఱ్రుల్
దుడుకున్ దార్ఢ్యము నావన్స్టులకటా! దోషాళి చుండంగ నే
డ్యోదకుండాయి మరేరి వేఁడెదను తండ్రీ! ఆర్త రక్షామణీ!.

మ. ఎవరిన్ వేఁడిన నేమిచేసినను తండ్రీ! నీదు దిక్కౌటచే
భువి నే నన్యులఁ బంచఁ జేరకను దివ్యుల్ మెచ్చ త్వత్పాద సం
స్తవముం జేయుచు నిల్చియుంటి నను నిచ్చల్ మెచ్చి రక్షింప నే
లవురా! శ్రీవర! దీనపాలుఁడవు గావా? ఆర్త రక్షామణీ!.

మ. కరుణాలేశము లేనివానివలె నన్ గాసింపఁగా నక్కటా!
పరుఁడన్ గాను త్వదీయ సేవకుఁడ నాధారంబు నీవే కదా
భరియింపన్ జాలి కన్నతండ్రి! యిఁకఁ నాపాపాళిఁ బోఁద్రోచి దు
స్తర సంసార దవాగ్నిఁ గూల్చుము మహేశా! ఆర్త రక్షామణీ.

మ. మను నే జెప్పుకొనంగ సిగ్గగు జగన్నాథా! మరేమందు ప్రా
ణను వాతండ్రిటు వీడి చన్నదిమొదల్ నాకష్టముల్ జూచువా
ర్లును లేరంటను రోజురోజు నిటు నాలోనేని దుఃఖంపుచుం
దినముల్ బుచ్చుచు నిల్చియుంటిఁగద తండ్రీ! ఆర్తరక్షామణీ!

మ. కడుపే నందఱిముగాఁగ నక్కటకటా! కానంతయుం సిగ్గులే
కడుగఁగరాని దుష్కృత్యకోటిఁ గని యాయానంబునం వీడి నా
కిడుఁడంచుం జెయి సాపఁజాలనిఁక తండ్రీ! వేఁ గటాక్షించి నీ
యడుగుల్ సన్నిధి నన్నుఁజేర్పుము ముకుందా! ఆర్తరక్షామణీ!

శా. ముల్లోకంబుల బ్రోచుతండ్రివిగదా పోషింపనన్నక్కటా నీ
ఫుల్లాంభోరుహ పత్రినేత్రి! బరువే? పోషింపఁగా రావె? నా
కిల్లుం వాకిలి సౌఖ్యముల్ వలదు తండ్రీ! చాలు నీసౌఖ్యముల్
కల్లల్ గావు పరంబానంగు మది మేల్గా నార్తరక్షామణీ!.

శా. విశ్వంబందుఁ గలట్టి వస్తుచయముల్ వీక్షింపఁగా స్వప్నసౌ
ఖ్యశ్రేణాయిత కీర్తిసామ్యములుకాఁ గాంక్షింపఁగాఁజాలు మూ
ర్ఖశ్రావ్యనంబనె? శాశ్వతంపు సుఖమా కైవల్యముం జూపుమా
శశ్వత్కీర్తి విరాజమాన! పరమేశా! ఆర్తరక్షామణీ!.

శా. ప్రైన్నాక్కాయెనొ తండ్రి! నీవె చవుమా? యాకేతిఁ శెన్నాం
తుతో! నన్నా! బ్రోవవె, బ్రోవవే యనుచు నేనార్తుండనై వేడు
చుం[ గన్నీరోడికగట్ట నిల్చుటలు? నన్నాంతున్ విలోకించి మ
త్భిన్నత్వం బిక నైన బావ దయరాదే? ఆర్తరక్షామణీ!.

శా. ఎంతస్వేఁడిన జూడకుండుట మహేశా! యెంతన్యాయంబా
శా! నంతైనం దలపోసిచూడు మదియే యానందమైయున్న 'నీ
వెంత స్వేఁడినఁ బ్రోవనిఁక మఱి యేదేని దగఁ జూచుకో
వ్యాంతర్జాలు' నటంచుఁ బల్కఁగనురాదే? అర్తరక్షామణీ!.

శా. నే నీవాఁడ నటంచు గర్వమున నెందేఁ గాంచ రానట్టి క
ష్టానీతంబుల బాధలన్ దలఁపకే నానంద మగ్నుండనై
యేనాఁ డెంతటఁ గన్నులారఁగను తండ్రీ! నిన్ను వీక్షింపఁగా
నే నున్నానో యటంచు నిల్చితినిగాదే? అర్తరక్షామణీ!.

శా. నాపై నింక ననుగ్రహం బునుపకున్న న్యాయమా? దేవ!
నే! నీపాలఁ బడియుండుటన్ నిజమునన్ విప్రతపాతంబుతో
భూపా, యేగతిఁ జూచినన్ పరిమె రాపుల్మాని యింకైన నీ
వే పాలించిటు నిల్చినాఁడఁ గృపరాదే? అర్తరక్షామణీ!.

శా. ఒకనాఁడా! మఱి రెండునాళ్లా? జనకా! 'ఓ! రాఘవా! దీన
పా! లక! యార్తుండను, బ్రోవవేదయను, కాళ్లంబట్టెదన్, బుద్ధి
పూ! ర్వకమున్ జేసిన తప్పు లేదు ననుగాపాడంగ రమ్మంచు నే
నకటా! యెంతని వేఁడుకొందుఁ? బరమాత్మా! అర్తరక్షామణీ!.

శా. ఏ జన్మంబునఁ జేసినట్టిఫలమో యీరీతి నన్ గట్టి తం
డ్రీ! జట్టాడుభు నష్టకష్టములపా ల్జిక్చింతతోఁ జేయుచున్
దేవం బందుచునుండె వేగ శరణార్థిన్ గాన బ్రోవంగ నా
పై జాలింతయుఁ జూపవే దయను దేవా! అర్తరక్షామణీ.

శా. ధనమున్ గోరఁగ లేదు నీపదయుగధ్యానంబుచే భూములన్
ఘనపూ మేడల మిద్దెలన్ నగరులన్ గాంక్షింపఁగా లేదు నే
నిను నేప్రొద్దును గోరుచుందునది తండ్రీ! యొక్కసారైన నీ
వదనా తావక దర్శనం బొసఁగ దేవా! ఆర్తరక్షామణీ!.

మ. కనులా కాయలు గాయుచుండె జనకా! కన్నారనిన్ గాంచ లే
కనికిన్ దీనులకన్న దీనతను నెట్లో కాలమున్ బుచ్చుచుం
డిన నన్ బ్రోవ దలంపు గల్గినను తండ్రీ! యింక వేవేగ నీ
తనువార్తించిన సంకోచాలు పరమాత్మా! ఆర్తరక్షామణీ!.

శా. పోనీగాని మరేమి వద్దికను తప్పో యొప్పో నీలోన నీ
వే నిక్కంబుగఁ జింతసేయు మిదియో యేఁజేసితిన్ గాన తం
డ్రీ! నన్ బ్రోవుము దిక్కు లేదనుచు నే నిన్నెంత ప్రార్థించినన్
బై నాకొక్కింతయు జూపకుండుటలు దేవా! ఆర్తరక్షామణీ!.

మ. పగసాధింపఁ దలంచితేని జనకా! పైవాఁడనా నేను? ప్రి
వుగ నీవుంటివి నాకటంచు మిగులన్ మోదంబులో నుందు నే
న! గణింపన్ బగవాఁడనైతి? సకటా! నాయాపఁ బోఁదోసి నీ
వ్వగలన్ ముంచుట పాడిగాదుసుమి దేవా! ఆర్తరక్షామణీ!.

మ. ఒకనాఁడైనను నీపదాంబుజములే నొక్కింత దుర్వృత్తినై
మకటా! యేమరి యుండలేని నను నన్యాయంబుగాఁ గాద సే
వకుఁ డంచైనను జాలిలేక నిటులన్ బాధించితే తండ్రి! పి
ప్పకపై బిన్నాకరంబు పోల్కఁగద రామా! ఆర్తరక్షామణీ!.

మ. అకలంకోజ్జ్వల దివ్యమూర్తివయి మాయామోహదూరాలోక
వా! లక సామర్థ్యవిరాజితాతిశయుతన్ రంజిల్లి సద్భక్తులన్
బ్రోకటామోద రసాబ్ధిఁ దేల్చు నకలాంతర్యామివౌ నీవు న
న్నాకనిన్ బ్రోవఁగ జాలకుందువె? కృపాబ్ధీ! ఆర్తరక్షామణీ!.

శా. ఎందుంజూచిన నీమహాత్మ్యమె కదా యీచింత నాకేల? నా
నందంబొప్పఁగ నన్ ద్వదీయభజనానందైక చిత్తంబుచే
నెందే వేళల నుండునట్లు జనకా! యేర్పర్చుమింకైన 'నా
నందో బ్రహ్మః' యటంచు వల్కుట ననంతా! ఆర్తరక్షామణీ!.

శా. జ్ఞానంబింతయు లేని మూర్ఖుఁడను విజ్ఞానమ్ముచే నింద్రియో
న్మానమ్మున్ విదళించి పూర్వభవ కర్మంబంధముల్ గాల్చుచున్
మానంబుల్ విడనాడి దుష్కృతములన్ గావింపఁగానుందు న
న్నీ నైపుణ్యము జూపి కావుమిఁక తండ్రీ! ఆర్తరక్షామణీ!.

మ. అవివేకాంబుధిఁ గూలకుండుటకు దివ్యజ్ఞానమున్ దెల్పవే
దివిషద్వర్గము సంతసించినటు లర్థింబూని నిన్వేఁడు నా
కవమానంబు ఘటింపఁజూడకుము దేవానీకమున్ బ్రోఁచు మే
లవురా! తండ్రి! తలంచు పుత్త్రుఁడను గానా? ఆర్తరక్షామణీ!.

శా. కామక్రోధ మదాతిలోభముల దుష్కార్యంబులెన్నెంటినో
భూమీశా! యొనరించి సిగ్గిలక ప్రాపుంగోరి త్వత్సన్నిధిన్
మోమాటంబున వేఁడుచుందు నను గృపల్ సైచి రక్షించినన్
నీ మాహాత్మ్యము గానుపించుఁగద తండ్రీ ఆర్తరక్షామణీ!.

మ. కలజీవంబులకెల్ల జీవుఁడవు, రాగద్వేషలోభాదు లె
వ్వలనన్ లేని మహామహుండవు నినుంబ్రార్థించు సత్ప్రార్థనల్
బలుమార్గంబులఁ బ్రోచు తండ్రివయి దేవా! నన్ను నీకీర్తి బా
ధల పాల్సేసిన ధర్మమౌనె? దయలేదా? ఆర్త రక్షామణీ!.

శా. నీ సంకల్పమె సృష్టిచిత్రముగదా నిన్బొల్ప నేనెంత? నా
కా సామర్థ్యము గల్గెనేని జనకా! యాచింతునే నిన్ను? జే
రానన్ దీనుఁడ వేఁడుచుంటి నను నాయాసంబు పాల్సేయ మే
లా? సత్కీర్తికి లోటురాద? కనరావా? ఆర్త రక్షామణీ!.

మ. మునునన్బ్రోచిన యార్తులెందరినొ సమ్మోదంబున న్బ్రోచితి
వని గ్రంథంబులఁ గాంచియున్న నవి సత్యంబంచు నేనెంచ కెం
తును నన్నిప్పుడు బ్రోతువేని నిజమంచున్ గాన వేవేగ పా
వనహా తావక దర్శనంబిడుము దేవా, ఆర్త రక్షామణీ!.

మ. కలికాలంబున దుర్మదాంధులెమటన్ క్షామంబులో లేమిచే
బలుకష్టంబుల నొందుచున్న నను గాపాడంగ రాకున్న ని
య్యల వేరెవ్వరు రక్షకుల్ గలరు? తండ్రీ! యెంత దుష్టుండనై
యిల జన్మించినఁ బాదసేవకుఁడఁ గానే? ఆర్త రక్షామణీ!.

మ. పరిదేహంబునఁ బ్రాశయామమున దివ్యాంశైన తేజంబునన్
గత జన్మంపు ఫలంబు దేహి విధి సంకల్పించు మార్గంబు నీ
క్షితికొందన్ దగవెల్గు నిన్ను ననురక్తిన్ జేరఁగాంక్షించు న
న్నతివేడ్కన్ దయఁజూడుమిక్కడను దేవా! ఆర్త రక్షామణీ!

శా. భక్తిఁ దక్షుల ముజ్జగంబు లరిపక్షు ల్భీతులై నట్లు శు
ష్కత్కాంతిం ధరియించి లోకముల నుద్యల్లీలఁగాఁ జేసి సం
రక్షింపం దగు రక్షకుండవుగదా రక్షింపరావా? జగ
ద్రక్షా! రక్షకులెవ్వరింక గనరాదా? ఆర్తరక్షామణీ!.

శా. ఆశాపాశములెల్లఁ ద్రెంచుటను నీశా! యింకనీగోర నే
యాశల్ నాకికులేవుగాని నిను లోకారాధ్యుగా నెంచు నే
రాశం గాంచఁగనుంటి వేగ నను నాయాసంబు పాల్సేయకే
యాశం దీర్పు మిదొక్కటే గనుక దేవా! ఆర్తరక్షామణీ!.

మ. సుతుఁడం, దీనుఁడ, బాదసేవకుఁడ నీసుంబూన నాబోటి దు
ర్మతిపై ధర్మమే? జనక! పారావార మింకింప, బల్
గతులన్ లోకము లుద్ధరింపఁదగు లీలల్దాల్చు నీబోటికిన్?
బ్రతిపక్షుండన ప్రోవకుండుటకు? దేవా! ఆర్తరక్షామణీ!.

మ. గతజన్మంపు ఫలంబుచే గెలువశక్యం బెంతయుం గాక ప్రా
కృతికిం మంత్రులవోలె నుండు నరిషడ్వర్గంబులం జిక్కి దు
ర్మతినై దుర్భర దుఃఖసంద్రమున మున్కల్ వేయు నన్నాగ్రహా
మతినిన్ బ్రోవుము దీనపాలుఁడవు రామా! ఆర్తరక్షామణీ!.

మ. నిను ధ్యానించుచు నీపదాంబుజములే నిక్కంబుగానాకు ది
క్కని ధైర్యంబున నంతసించుటను నాయాశన్ విడం దీయకో
యనఘాత్మా! కరుణామయుండవుగదా యార్తుండనేనౌట నం
తను గాపాడఁగ రమ్ము లెమ్ము ప్రభు దనంతా! ఆర్తరక్షామణీ!.

మ. కనుమూయన్ జగమంతశూన్యముగదా కామ్యంబులర్థించి
తీ। రని దుఃఖంబులు దెచ్చుకొందున ఘటప్రారబ్ధమున్ బొంద?
నో। యనఘా! యేనిక నివ్విధమెల్ల భవదీయాభిక్షతన్ గోరి యెం
తను ద్వత్సన్నిధిఁ దక్క నౌనవ ననంతా! ఆర్తత్రాణమణీ!.

మ. మలమూత్రాన్వితమైనతనువెంబడి ధర్మంబంతఁజింతింపఁగా
గలదే సౌఖ్యమొకింతయైన? నటులన్ గాంక్షించినన్ నీటి బుం
గల చందంబిది దా మరేల జనకా! నాకై విచారింప? పెం
పలరన్ ద్వత్సముఖమ్ము వేకొనఁగు దేవా! ఆర్తత్రాణమణీ!.

శా. ఆకాశంబున శబ్దముంబలెను దివ్యంబైన నీదివ్య లీ
లాకారంబు సమస్తలోకముల నువ్యాప్తంబై కనన్
రాకన్ జ్ఞానధరాధరంబాగిని ప్రారంభించ వర్షింప నీ
యాకారంబు ప్రబోధయం బగునుగాదా? ఆర్తత్రాణమణీ!.

మ. అరవిందాసనుఁ డాదిగాఁ దృణపర్యంతంబు నీవై మహా
త్తరమా మాయను లోకజాలముల మిథ్యాకీర్తి గావించి యు
ద్ధరతన్ బొమ్మల బొమ్మలట్లు గుణమాలన్ జేసి యాడించునిన్
శరణేఁ గోరితి నెట్లు ప్రోచెదవో యీశా! ఆర్తత్రాణమణీ!.

మ. అరిషడ్వర్గము ద్రోసిపుచ్చి మదియం దారాటముల్మాన్పి,
ను। స్థిరతన్ దావక పాదపద్మముల నర్థిన్ మనోవీధి ని
బ్బరవున్ మార్గమునిల్పు సజ్జనునిదే భాగ్యంబు తద్వృత్తి నా
కరయన్ లభ్యముసేయవే దయననంతా! ఆర్తత్రాణమణీ!.

శా. శాసింపన్ గలవైన నాక్యపరి గంగా, గౌతమీ, నర్మదా,
కావేరీ ముఖ్యలైన పుణ్యనదులన్ గాంక్షించి స్నానంబు స
ద్భావంబెంతయుఁ గోరిధకామముల బంధంబందునం జిక్కుటన్,
సేవేశితిని లోరితో? వన్నికను తండ్రి! ఆర్తరక్షామణీ!.

మ. జననంబందిననుండి చేయఁబడు దుష్కార్యంబులన్ దల్పగా,
వినుమా తండ్రి! భయానకంబయి మహోపేక్షన్ బ్రవర్తిల్లు చుం
టను దిక్కెవ్వరటంచు భీతిలుచు నున్నానిట్లు దీనుండనై
నను రక్షించిన రక్షకుండవు గదన్నా! ఆర్తరక్షామణీ!.

మ. మునుపైదైత్యాఘము లమృతంబుఁగోని పోఁబోవ న్సురవ్రాత
ముం! తను భీతిల్లుచు నిన్నుఁజేర దయచేతందాల్చు నీరూపుసే
తనులం గాంచిన భాగ్యమింపొదవఁగాఁ గన్పట్టఁగాఁ జేయవా
జనకా! కన్నసుతుండఁగాన జగదీశా! ఆర్తరక్షామణీ!.

మ. ఖలుడైనన్ ఘనుడైన దండ్రి సుతునిన్ గాపాడఁడే? యింత
గాఁ! జలమచ్చోటను బూనునేజనక? త్వద్దాస్యంతంబునందుంచు
మా! ఖలుఁడన్నీసుత తండ్రి! కావుమని నే కాళ్ళెత్తుల న్బట్టినన్
జలమున్మానక నిల్పియుంట తగదీశా, ఆర్తరక్షామణీ!

మ. అకటా! దీనులపాలి పెన్నిధివి, జ్ఞానానంద సామ్రాజ్యపా
లక వర్గంబున కాప్తమిత్రుఁడవు, ఆర్తశ్రేణికిన్ దేవతా
నికరపాలిట కల్పవృక్షమవు తండ్రి! యిట్లు నీవుండి యిం
చుక మత్ప్రార్థన నాలకించవాకా? రామా! ఆర్తరక్షామణీ!,

మ. పుడమిన్ బుట్టియు బ్రాహ్మణాన్వయమున న్బొల్పొందఁగా
నందులోఁ। గడనన్ గాంచియు దావకాంఘ్రి భజనాకాంక్షన్ విలో
కింప నేఁ। బడుపాటు ల్వచియింపలేను జనకా! ప్రారబ్ధకర్మంబు
నా। కిఁటుముల్చెబ్బక్కులు దార్చుచుండె గద రావే? ఆర్తరక్షామణీ!

మ. పగవాఁడంతటి వాఁడుగూడ జనకా! పాదంబు లన్బట్టినన్
దగుమాత్రంబు కటాక్షముంచునుగదా త్వత్పాద సంయుక్త చే
నగడన్ నిల్చిన నన్నిటుల్ నలిపినన్ నీకేమి సంతోషమా?
తగునే? ధర్మము వీడనాతునె? కృపాత్మా! ఆర్తరక్షామణీ!.

మ. నను నీకిత్తిని బాధబెట్టిన జగన్నాథా! నినున్వేఁడి యుం
డు నటంచు న్మదినెంచితేని యటు సంతోషింప బోకింక; స
న్నినుమొంతేఁ దయఁజూడకున్న నిటుల న్వేయేండ్లునైనన్ నిన్మ
నమం దెన్నుచు నిల్చియుందుసుమి రామా! ఆర్తరక్షామణీ!.

శా. నీ మానంబుఁ బరిత్యజించి యిఁక నేనిఁక దీనుఁడన్ గాన నీ
మోమున్ గన్నుల పండువౌనటుల సమ్మోదంబునం జూపి నీ
సాన్నిధ్యంబున నన్ను జేర్పు మదియే చాలంగ వేవేగ నీ
వీమాత్రంబు గటాక్షముంచనగు తండ్రీ! ఆర్తరక్షామణీ!.

శా. నీకే కన్నసుతుండనైన నను బోషించుచు లాలింప త్వ
ద్ధ్యానంబందున నెంచకున్న నిఁక నైవారింత దోషింతువో
నీవే కొంచెమడంచుచున్ జనక, తండ్రీ యిట్లు శాసించినన్
నైన్నారెవ్వరు పుత్రిన్మనుప? దేవా, ఆర్తరక్షామణీ.

మ. ననుఁగావన్ నినుఁగాక వేరొకరి నెన్నండేని నోరార మ
న్ననముం దెంచితొ? మాటవాసికయినన్ నన్యుల్ బ్రోవము స్వాధిలో
నిను నే నల్పునిచెంత నిల్పితినా? తండ్రీ, యెందుకీరీతి నన్
న్ననుపస్థల్పుక నిల్పితో చెపుమ? రామా, ఆర్తరక్షామణీ.

మ. కరినాథుండు జలగ్రాహంబు బలయుక్తస్ఫూర్తిని బట్ట నం
బరమున్ బ్రాసుచు దిక్కులేమి నది దేవా, జగద్రక్షకా,
కరుణింపన్ దగునీవె యంచుఁ బలుకన్ గాపాడవే? అంత సు
స్థిర కారుణ్యము మానెగాని కనరాదే? ఆర్తరక్షామణీ.

మ. వగవాఁడౌగద యావిభీషణుఁడు? బోవన్ గంకణంబూనితే
నిగమాధార! విశేషమేమి? అదియే నీచిత్తమై యున్నచోఁ
దగనే నేనును వానిరీతిఁ గనఁగా? ధర్మంబె నీకిట్లు నన్
బగసాధింపఁ దలంపఁబూనుటలు? దేవా, ఆర్తరక్షామణీ.

మ. సకలంబున్ సమమంచు నిన్నెఁగను విజ్ఞానుల్ ప్రవర్తించుచో
సకలాంతఃకరుణాన్వితుండవయి ప్రజ్ఞావైఖరిన్ లోకపా
లక సామ్యంబున వెల్గు నీవిటుల ధర్మంబెంతయున్ వ్రాసితే
అకటా! యింతటి పక్షపాతమిది కాదా? ఆర్తరక్షామణీ.

మ. జగమే మందిర మందమూల్యధనమే జ్ఞానంబు, సద్ధర్మమే
తగు సద్వృత్తి, సఖుండె పేరిమి, అల భక్తవ్రాతమే సేవకుల్,
యుగమే సూత్రము, కాలమే చరితమై యొప్పారు నీకేలితో
ఖగరాడ్వాహన, కావుకావు మదిమేల్కొన నార్తరక్షామణీ.

మ. భగవంతుండు కృపాసమేతుఁడును, దివ్యజ్ఞాన సంశోభితుం
డగునంచున్ నిగమంబులెల్లఁ బలుకంగా నీవు తద్వాక్యముల్
బగసాధించెడు రీతి నాశ్రితుల దేవా, చూడఁగా నెంచితే
తగునా? ధర్మము నీటఁబుచ్చినటు కాదా? ఆర్తరక్షామణీ.

మ. అలుకన్ బూనిన శెప్పఁజాల వినుమీంతైనన్ మహానందప్రే
బలువై వచ్చు కుజీవనంబుఁ దన గర్భంబందునన్ దాచి పెం
పలరన్ దత్శుభకీర్తిఁ జూవ నిక నీకా కీర్తికిన్ హాని నా
వలనన్గల్గును బోర్చుచోఁ జెపుమ? దేవా, ఆర్తరక్షామణీ.

మ. అకటా! తల్లివి దండ్రివీవెయని ధ్యానాసక్తతన్నిన్నె మా
నుక చిత్తంబున నమ్మియుండుటను ధర్మంబు న్విచారించి కా
వక నందర్శన భాగ్యమీయవె కృపా పారీణతన్ గాంచ సా
త్త్విక భావంబున నాశ్రితుండఁ గనరాదే? ఆర్తరక్షామణీ.

మ. నిను నేనిట్లు త్రికాలముల్బిలుచఁ దండ్రీ, ఘోరసంసార వా
ర్ధిని నింకెంతని యీదనేర్తు? దరిఁ జేర్పించి రక్షింపవే
యని నేనెంతగ వేఁడుచున్న నొకనాఁడైనన్ గటాక్షింప రా
వని నిన్ గాంచు పరుల్ ననున్ నగరె? దేవా, ఆర్తరక్షామణీ.

మ. ఎవరున్నారని చేరఁబోయెదను? తండ్రీ, తండ్రివౌ నీవె నా
కవమానంబు ఘటింపనెంచిన? మదజ్ఞానంబుకై యిట్లు నేఁ
బలుమారేలును గూర్చులేక మదిలోఁ బల్మార్గము గ్గింతత్రో
వ్వురా, యొంటుపులప్ప దీనత ననంతా, ఆర్తరక్షామణీ.

శా. నాసామర్థ్యము జూడనెంచి యిటులన్నాతండ్రి, బాధించు
చో! నీసామర్థ్యము కేనుమెచ్చ; నను నింతేగాక వేయింతలన్
గాసిన్ జూపిన మన్ననంబు చెదరంగా రాక సుంతైనఁ బై
పై సంతుష్టినె చెందుచుందునుమి దేవా, ఆర్తరక్షామణీ.

మ. అడుగన్నాన్నిన బెట్టదమ్మయిన గాదా? యంచు రూపించి
సాజ్జడుఁడన్ గాదె? మహాత్మ, మరెట్లువేఁడెద నను న్నాక స్థలం
పూనుమా! కొడుకుల్వేఁడిన వేడకున్న జనకుల్ గోర్కుల్ప్రసా
దింపరే! యెడనైన న స్పృడసూప గోరితిని తండ్రీ, ఆర్తరక్షామణీ.

మ. మునునిన్వేఁడిన వారికంటె గడుమెప్పుంగాంచ నేనేమి నిన్
జనకా, కోరితినా? మరేదయిన నాసమ్మాని బల్వంత మే
నిను నేఁ బెట్టితినా? మరేలనిటు తండ్రీ, ప్రోవ రాజాగు? నన్
గనరాకున్నచో పాదసేవకుఁడఁ గానా? ఆర్తరక్షామణీ!.

మ. దయఁజూడందగు తండ్రిప్రీవెయనిగాదా? యెంతోసంతుష్టి
చే! భయమింతైనను జెందకుండ జనకా, త్వత్పాదచింత న్విని
శ్చయబుద్ధిన్ దళుకొత్త నిల్పితిని? నన్నాశించిరన్ లేక నీ
నియమంబుల్ గనఁబర్చినన్ సరియె తండ్రీ, ఆర్తరక్షామణీ!.

మ. పరులన్వేఁడను నీదుపాలఁ బడుటన్ పాపంబెడందోసి సు
స్థిర కారుణ్య కటాక్షవీక్షణముల్ దేవా, కటాక్షించు నేఁ
బరుఁడన్ గానుగదా? పరాకుతగునా? పాలింపరావా? పరా
త్పర, దీనావన, యోరమేశ, పరమాత్మా ,ఆర్తరక్షామణీ!.

శా. నీకన్నన్మరి దిక్కెవేరెవరు తండ్రీ, నీవె కాకున్న యీ
లోకంబందుఁ గలట్టి యార్తులను? ముల్లోకంబులన్ గాంచినన్
నీకున్ మించెడు తండ్రిఁ గాంచఁగలమే? నీవేమి కావించినన్
హే, శంకేశునా, నీద భారముగఁ గాదే? ఆర్తరక్షామణీ!

శా. నాదౌ పూర్వభవార్జితంబు గలనై నన్ గాంచనీకుంత నా
మోదం బ్రేమది యెంతయున్న నౌదరింపింపఁ విలోకింపఁగా
రాదంచెంచెనఁ గాని తండ్రి, కనులారన్ గాని నీపైనఁ ద్వ
ర్త్వాదంబు ల్గనఁబర్వఁ జాలవుకొ? దేవా, ఆర్తరక్షామణీ.

శా. ఏయే పాపము లెన్నిసారులను మున్నేఁ జేసి జన్మించితో
నా యీపాట్లను జూచుచుంటివి గదా? నాతండ్రి, యుఁకేలనన్
వేయార్వ్వి విధంబులన్నిఁటను గన్నిరోద్యఁగాఁ జేయు? నీ
వే యీరీతి నౌకర్ప నేమనెద? తండ్రి, ఆర్తరక్షామణీ!.

శా. అజ్ఞానంబునఁ జేసినట్టి కృత్యాకృత్యంబు ల్మదిం దల్చి న
ర్వజ్ఞత్వంబగు నీమహాత్మ్యమును దివ్యంబైన త్వత్తేజము
బాలిశ్శిత్రులఁ జూపకుంట దగునే? భావ్యంబె నీకిట్లు మా
పక్షానార్థుఁ గష్టపెట్టుటలు? దేవా, ఆర్తరక్షామణీ!.

శా. కారుణ్యామల సాంద్రచంద్రుఁడని నిన్ గాంక్షించి యుంటన్
మహా! దారిద్ర్యంతతిఁ జేరఁదీసి నను వాత్సల్యంబుచే గద్భపా
కారం బుద్ధరింపాల్చి దేవతల దక్షత్వంబునన్ బ్రోచిన
ట్లేరా, తండ్రి, సుత్యుంచనాటఁ గనరాదే? ఆర్తరక్షామణీ!

మ. పరులన్ జూచినభంగి చూచుటలు న్యాయ్యంబె? నాతండ్రి, నే
బరువై యింతవదోచితే జగములెప్పాటున్ గనన్ జాలితో?
కరుణన్ ద్రౌపతినెట్లు బ్రోచితివొ? ఏకన్ నాటి ప్రహ్లాదు నే
పరువన్ బ్రోచితొ? నీకు మూకమిక దేవా, ఆర్తరక్షామణీ!.

మ. మనసా, లోకము పాపమూ గదవె; సమ్యగ్జ్ఞానవ త్ప్రేక్షచే
జనకా చూపుటను నింద్రియాళి నిను నానన్ జూపి దుఃఖాబ్ధిలో
మునుగన్ జేయు నటంచు జెప్పినను తన్మాత్ర గర్వము న్యాయమో
జనకా, బ్రోవవె దీనుడన్ గనుక నీశా, ఆర్తరక్షామణీ!.

మ. కలలోగాంచిన వస్తువుల్పలెను లోకంబన్న మత్పూర్వపున్
ఫలమే మోగద తుచ్ఛసౌఖ్యములపై భావం బొకొక్కప్పుడు
మ్యోలపై నూగెడు చందమున్ననుము; పయ్యాటోపమున్మాన్పి ని
శ్చల చిత్తంబును జేయ వేడెదను ఈశా, ఆర్తరక్షామణీ!.

మ. జనకా, చేసిన పాపముల్దలంచి పశ్చాత్తాప తప్తుండనై
కనులం దశ్రుజలంబుగార మిగులన్ గాపాడరమ్మంచు హా!
నిను నేప్రార్థనను గోరుచున్న నిటు తండ్రి, బ్రోవరాకుండ జా
గొనరింపన్ దలపోయధర్మము? కృపాబ్ధీ, ఆర్తరక్షామణీ!.

మ. శరణన్నన్ దయతోడ బ్రోచుటయె నీసంకల్పసంసిద్ధి యు
ట్లనుచున్ గూడను బ్రోచునీకు ననునాయాసంబు పాల్సేయ నం
బరమే? తండ్రి వపుపాలముయు భావ్యంబౌనె పూనంగ? భా
వనవద్వత్వము జూపుమింకయువ దేవా, ఆర్తరక్షామణీ!.

శా. పాలన్ముంచిన నీటముంచినను దేవా, నీదెభారంబు నా
దేలా నన్నొక దీనుఁగాఁ జూడవు? నీకేయున్న నన్నేమనె
లీలన్బ్రోవఁగ జాలవే? కరుణాలీలాంత రంగంబునీ
జాలంబేలను? దివ్య నీపాద భూషా, ఆర్తరక్షామణీ

శా. అన్నా, నామది కల్లగాదు వినుమీ వక్షాబ్ధిలో దెబ్బ తా!
నిన్నే ప్రొద్దు తలంచుచుంటినా, సద్భక్తిభావంబుచే
నన్నే ఘోరము లావరించెనో యుటంచెంతో దీనుడనై
యున్నాఁడ బను నేలరాఁగదె కృపాళూ, ఆర్తరక్షామణీ!.

శా, ఎందెందో వెదకంగ నేల హరి నేయేజాదలఁ జూచినన్
విందుల్ గుల్కెడు నవ్వునెమ్మొగముతో వీక్షింపఁగా వచ్చె దా
వందందంచు వచింపవిందు జనకా, యిట్టియున వాలకమ్మా?
యొందుఁ జూచిన గానరావుగద తండ్రీ, ఆర్తరక్షామణీ!.

మ, చపలాత్ముంప నటంచు నీవెరిగి నిస్సారంబునన్ జూచితే
కృపవేరెవ్వరి వాలు సేయుదువు? నీకున్ గాక ... కముల్
నిపుణత్వంబున నేల నెవ్వరికగున్? నీ భక్తి జాలించి తే
నొవముఁ జూడక ప్రేమజూపుమిక తండ్రీ, ఆర్తరక్షామణీ!.

మ. కడుపారఁ గనినట్టి పుత్రులను విస్ఫార్యంబు దుఃఖాబ్ధిలో
బడఁగూల్పన్ వినువంటిదంపతులకున్ సంభావ్యంబా, భావ్యంబా యి
య్యెడ నోర్కొంతవదించు దీనుఁడను దొంకేది నన్నార్పనే
యుడయిన్ దుఃఖము లందుచుందును? ప్రభూ! ఆర్తరక్షామణీ!

శా. నాకేలోపము రాదు; వచ్చిన జగన్నాథుండవౌ నీవు న
న్నాక్రమింపను జాతువంచు మదినెంతో మోదమునం గొందుచుం
నీ కారుణ్యముకై యిటుల్ నిలచి యుంటిన్ గాని స్వప్నంబునన్
నాకీ కర్మము దెత్తువంచెఱుఁగ నన్నా! ఆర్తరక్షామణీ!.

శా. ఏదో యింతటి మత్పురాకృతము నన్నీరీతిఁ బెన్గష్టముల్
గాదన్వారలు లేమి చూచినను వేగంబింక మోదంబుగా
నా దీనత్వము నాల్పరమ్ము కను; నన్యాయంబు లేకున్నని
వాదంబేలను? దిక్కు నీ వెకద దేవా! ఆర్తరక్షామణీ!.

మ. జననంబందుచు ఘోరపాపములచో; సంసారమందుంటి యె
న్నను ఈరీతిని దిక్కులేక తెనువంతల్ బొందుటింకెంత నో
యనఘా! పాపము నీవు చెప్పవలెనే? యైనన్ భవత్పాద చిం
తన చేకూరుట ముక్తికర్తృతను గాదా? ఆర్తరక్షామణీ!.

శా. అన్నా! ఇన్నిమరేల? నామదిని యున్నట్లంత సత్యంబుగా
విన్నా గొల్చి వచించుచుంటి నను నంతేబాధలం జూపినన్
నిన్నే నేమఱి యుండకుండునటు లెన్నాంటన్ నిల్చి యూపైని మా
కున్నింపందగు నీవు సన్నిధిని రామా! ఆర్తరక్షామణీ!.

మ. జపహోమార్చను లెట్టివిన్, ఘనతప స్స్వాధ్యాయసంబుల్
భవ తత్పృవకై యెగతిం జేయుటో తెలుగ సుంతైరాని మూ
ఢుఁడనై చపలస్వాంతుడనై వ నీకృతిని ధరాంతంబు ద్వర్తన్
షిధీ! నిపుణత్వంబుననిల్ప నిచ్చితిని తంస్రీ! ఆర్తరక్షామణీ!.

సంపూర్ణము.

శ్రీసీతా రామార్పణమస్తు.

